# భోగినీదండకము.

బమ్మెరపోతనామాత్యప్రణీతము

తంజనగరము. తేవప్పెరుమాళ్లయ్యగారిచే

వ్రాయఁబడిన

టీకాపాఠాంతరాది[illegible]ములతో



ఆంధ్రసర్ వీధి నెం. [illegible]యునందుండు

వేమూరు-వేంకటకృష్ణమసెట్టి అండు సన్సుచే

ప్రకటితము.

1916

# విషయసూచిక.

# పీఠిక

---

ఈదండకమును రచించినకవి బమ్మెరపోతన యని దీని దిపద్యమువలనఁ దెలియుచున్నది. ఇతఁడే యాంధ్రభాగవతమును రచించినకవి యగునని యిందే నిదర్శనములు పెక్కులు స్ఫుటముగఁ జాటుచున్నవి. వానిని మీఁద విమర్శింతము. ...దలి కథానాయకుఁడు సర్వజ్ఞసింగభూపాలుఁడు. ఆరాజు నొక ...శ్య 'వలచి వలపించుట' యే యిందలి వస్తువు. కాని యీరాజు ...సింగభూపాలీయాదులను రచించి సుప్రసిద్ధిఁగాంచిన 'సర్వజ్ఞ ...సింగమనీఁడా' యని విచారింప వలసియున్నది. వెలుఁగోటి వారి వంశచరిత్రంబును బట్టిచూడఁగాఁ గుమారాన్న పోతరాజు ...కును బోచమాంబకును బుత్త్రుఁడతఁడుగాక యతని మనుమఁడైన మఱియొకసింగభూపాలుఁడని తేలుచున్నది. దీనిచేఁ పోతనయు శ్రీనాథుఁడును సమకాలీనులను ప్రతీతికి విపర్యయము గలుగుచున్నది. కవులచరిత్రమందు 'పోతరాజు తర్వాత షష్ఠస్కంధమును రచియించిన సింగయ యెఱ్ఱాప్రగడకు మనుమని మనుమఁడయి యున్నప్పుడు పోతరాజెఱ్ఱాప్రెగడ మనుమని కొడుకు కాలములోనివాఁడయి యుండును. ఎఱ్ఱాప్రెగడ రచియించిన హరివంశమును గృతినందిన యనవేమారెడ్డి మునిమనుమఁడయిన వీరభద్రరెడ్డి కాలములో శ్రీనాథుఁడుండుట చేతను, ఎఱ్ఱాప్రెగడ ముమ్మనుమని కాలములో బమ్మెరపోతరాజుండుట

చేతను శ్రీనాథ పోతరాజు లేక కాలము వారగుటను సందే హముతో దని యున్నది. ఈ విషయమును నిర్ణయించుటకు నీ చిన్నపొత్తమునం దయితిలేదు గావున నిది యట్టుండనిచ్చి యి చ్చట ముచ్చటింపఁదగి యున్న వేఱు రెండొకవిషయములను బర్యామర్శితము.

ఉ. 'బాల రసాల సాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి? గహనాంతర సీమలఁ గందమూల కౌ
ద్దాలికులైన నేమి? నిజదార సుతోదర పోషణార్థమై'

అనియు

ఉ. 'ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట వ్రేటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పెఁ దా
బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్'

అనియుఁ జెప్పినవిరక్తజనచూడామణి తుదిఁబోయి యీదండకమును వేశ్యా విషయకముగా రచించుటయు నరాంకితము గావించుటయు నుపపన్నముగాకున్నది. కాని యిది శృంగారరసమునకుఁ గ్రొవ్వినతఱి యగునెల ప్రాయపునాఁటి రచనగా నుండవచ్చును. వయస్సు ముదురుకొలఁదిని విరక్తియుఁ గుదిరి భాగవతమునట్లు దేవాంకితముఁ గావించి యుండనోపు. కాఁబట్టి యీ గ్రంథము నరాంకితమగుటయే యిది భాగవతమునకుఁ బూర్వము రచితమై యుండవలయునని తెలుపుచున్నది. తిక్కనయుఁ దన నిర్వచనోత్తర రామాయణమును మనుమసిద్ధి కంకితము చేసినట్లు, పిదప రచించిన మహాభారతమును నరాంకితము చేయఁ

షయ్యె. ఇట్టి తత్తద్వయోవస్థా విశేషపోషితములగు నాయా రసముల కనురూపములుగా నాయాప్రబంధవిశేషములు రచించుట కవులయందుఁ బ్రాయికముగాఁ జూపట్టుచున్నది.

సింగభూపాలుఁడు తానొకదినమున నొకవేశ్యకు లోనగుటఁ గాంచి సంకోచము నొందఁగాఁ గవి

గీ. ఎసకమైనవాని వసుమతి నొకవేశ్య
సంగమెల్ల ధర్మవర్తనంబు
కానఁ బుణ్యసిల్లునారికి వలదా
చిత్తజాతరూప సింగభూప

అని చెప్పి యాకలంకఁ బుచ్చె నందురు.

ఈ దండకము నాంధ్రభాగవతకర్తయె రచించె ననుటకు శైలిమొదలగువానియందు దీనికిని నా భాగవతమునకుఁ గలపోలికయే ప్రబల నిదర్శనముగా నున్నది. శైలియందు నిందును నందును గొన్ని సామ్యములను జూపుట సరసము.

'తల్లికిన్ బాసీఁగి కామానలజ్వాలలన్ వేఁగి చింతాపయోరాశిఁ గ్రుంగంగ నింపైన యోఁగి
సంతాప ఘర్మంబులం దోఁగి చింతించుచుంటిన్.' భా. దం.
నీ సత్కథాసార చంచత్సుధాసారపూరంబులం గ్రోలి సౌఖ్యోన్నతిం
సోలి ధీయుక్తులై వ్రాలి తాపంబులం గోలి మోహంబులం దేలి సంపన్నులై
యున్న నిత్య ప్రపన్నుల్.' భాగ. ౪. స్కం.
కర్మంబులం ద్రుంచి సంసారముం ద్రెంచి సన్న్యస్తులై మించి. ౧౦. స్కం.
పల్లసత్పుల్ల మందార రాజన్మరందంబు నందంబునం గ్రోలు మత్తాళి దు
ర్వారముల్ గ్రోలునే హేమరాజీవ...గ్రాహకాంబు శైవాల......
కాసారముం జేరునే. భా. దం.

సీ. మందారమకరందమాధుర్యమునఁ దేలు మధుపంబు వోవునే మదనములకు

ములుగను గనుపట్టుచున్నవి. పదోద్ధంఢముగ నుంట దీనిను ద్దండదాడకం బని యం డ్రనుట ముమ్మాటికి నిక్కము. ఇందు వేశ్యమాత జాత్యనురూపముగాఁ గూఁతునకు బోధించు నీతు లును, నతిమనోహరము లగు రచనావిలాసములతోడ నానా లంకారచమత్కారచాతురీవికాసములతోడను వర్ణింపఁబడి యున్నవి. మఱి రాజవర్ణనమును వేశ్యాకన్యా వర్ణనమును నతి హృదయంగమములుగా నలవరింపఁ బడియున్నవి. భాగవత మహామకరంద ప్రవాహమాధుర్యాతిశయమున కిది మంచి మాదిరియని చెప్పనొప్పుచున్నది.

ఇట్టి దండక మచ్చుప్రతులం గూఁ జాలఁ దప్పులకుప్ప గా నుండుటఁజూచి దానిని గూడినంతవఱకు నిర్దుష్టముగా ముద్రింప వలయునని ప్రాచ్యలిఖితగ్రంథభాండారమునం గల యూఱుకోశములను, 'అకేడమి' వారియొద్దనున్న రెండుకోశము లను దోడుసేసికొని పెక్కుదోషముల సవరించితిని. ఈ సవరణ లిన్ని యన్నియని చెప్పనలవికాదు. రెండొక యుదాహరణములు.

' ఈరీతి నేనాతిచే వింటివేమంటి నీవంటి దీవెంట వేదం టమై గెంటిపోఁజూచునే తమ్మికంటీ నినుంగంటి నీవెంటకాహా కనుంగొంటి నీగొంటు చైదంబు......వెంటవెంట బడక దంట నే వంటనింటక చిరంటీచెనంటీ గుణాంబేటికే. అచ్చుప్రతి.

ఈరీతినేనాతిచే వింటివే యింటి నీవంటి దీవెంట వేదంటమై గెంటిపోఁ? దమ్మికంటీ నినుంగంట యీవెంటకా? హా కనుం గొంటి...వెంటవెంటంబడక బంటనే? దాఁటనింటిక జెనంటీ చిరంటీ గుణాంబేటికే

'నరేశులఁ రతి స్త్రీజితోద్దండ చండామిత్రా ఖర్వా-ర్వాంధ వేదండ గండస్థలీ ఖండితారాది దండంబు గండంబుగానుండు నయ్యుండ లేశుఁ విరాజన్ముఖాంభోజు నాభోగినిరాజుత్రానోజితోసికు బోత్తుండఁగాఁ బోలునే నీకు మాదండ నేదండముండెల దే చెల్లునే రాచదండంబు గండంపుదండంబుగా నిక్షు కోదండ విభ్రాజితభూయుగా. అ. ప్ర

నరేశులఁ జిత్రశీసురేశులఁ, గతిశ్రీ జితోద్దండ వేదండ! మాదండ నేదండముఁ జెందదే. రాచదండంబు గండంబు పుండ్రేక్షుకోదండ......

తద్ధాత యీవారభామాతనూజాతకుఁ నూతుఁగా మాతనూజాతఁ గావించె. అ. ప్ర

తద్ధాత......జాతకుఁ నేతగా మాత నుజ్జాతఁగావించె.

మాతల్ తనూజాతలఁ జాతవిత్తాశలై బేశలత్వంబున బాపినారోటు బోరోటు రతూరతిం గోర్కెలీడేఱ. అ. ప్ర

మాతల్ తనూజాతలఁ జాతవిత్తాశలై యాశలం బేశలత్వంబు లేకన్మలిం బాపినారోటు రారోటురతూరతిఁ గోర్కెలీరోటు.

ఇట్టివి పెక్కులుచూపవచ్చును. దీని నాయథాశక్తిని శోధించి యమ్యొమెకలఁ గటువులగుపదములకు లఘుటీకం గూర్చినాఁడను.

ప్రాచ్యలిఖిత గ్రంథభండారమందలి ప్రతులాఱును, క, ఖ, గ, ఘ, చ, జ, యనియు అకేడమి ప్రతులు రెండును. ట, ఠ, యనియు సంజ్ఞితములు. ట, ఠ, లు క, జ, లవంటివి.

త. తేవప్పెరుమాళ్లయ్య

# శ్రీరస్తు.

# భోగినీదండకము.



శ్రీసర్వజ్ఞ సింగరాజ వర్ణనము.

శ్రీమన్మహా మంగళాకారు, నాకార లక్ష్మీకుమారుం, గుమారీ మనోరాము, రామాంబరీషాది రాజన్య 1 రాజద్యశః కాముఁ, గామాహిత క్షీరవారాశి 2 తారా శివాగేంద్ర మందార కుందారవిందాహి తాకాశకల్లోలినీ కాశ విఖ్యాత సత్కీర్తి ముక్తావళీభూషి తాశాంగనా లోకసీమంతు,

ఆకారు...కుమారుఁ=రూపమునందు మన్మథుఁడైన వానిని, కుమారీ మనోరాము=జవరాండ్రకు మనస్సు రమింపఁజేయువానిని, రామ...కాము = రాముఁడు అంబరీషుఁడు మొదలగు రాజుల ఒప్పుచున్న కీర్తిని కోరువానిని - అట్టికీర్తి గలవానిని, కామా...సీమంతుఁ=శివుఁడు, పాలసముద్రము, నక్షత్రములు, కైలాసము, ఆదిశేషుఁడు, కల్పవృక్షము, మల్లె, తెల్లదామర, ఆకాశగంగ, రెల్లు అను వీనివలె పొగడ్తకెక్కిన మంచికీర్తి అనెడు ముత్తెముల వరుసచే అలంకరింపఁబడిన దిక్కులు అనెడి స్త్రీసమూహముయొక్క పాపట గలవానిని - శివాదులవలె తెల్లగా నున్న ఆరాజుకీర్తి దిక్కులనెడు స్త్రీల పాపటలకు ముత్తెపుసరిగా నుండినదనుట. అతని కీర్తి తెల్లనై దిక్కులకొన వఱకు వ్యాపించినదని భావము. సీమంతినీ...మసంతుఁ=స్త్రీల మనస్సులు

1. క. రాజీయయశః కాము. 2. అ. తారేశవాగేంద్ర...దారవిందాక్ష కల్లోలినీ.

సేవంతీసేవమాన సారామ వాటీ వసంతుక్, వసంతావనీనాథ సంసే
వితాంచత్పదాంభోజు, నంభోజరాజీసుహృత్తేజు, దేజో జయ
ప్రాభవ స్ఫూర్తిధామము, నుద్దామ జన్యావనీ భీము, భీమప్రతాపానలాభీల
కీలావినిర్మూలితారాతి పాండ్య క్షమాపాల దుర్వార గర్వాటవీ
వాటు, 1 వారాధిపోరుప్రభా భాసురస్ఫార కల్యాణదుర్వారు,
వారాశి వేలా పరీతావనీభార ధౌరేయరాజన్మహోబాహు,

---

(అనేకు) పూఁదోఁటలకు వసంతఋతువైనవానిని=వసంతఋతువు తోఁటలను రంజించునట్లు స్త్రీల మానసములను రంజించువాఁ డనుట. వసంతా... భోజుక్=వసంతుఁడనెడి రాజుచేత మిక్కిలి సేవింపఁబడుచున్న ఒప్పుచున్న అడుగు తామరలు గలవానిని, అంభో... తేజుక్ = (తామర సమూహమునకు మిత్రుడైన) సూర్యునివంటి తేజస్సుగలవానిని, తేజో...ధామము=తేజస్సు జయము ప్రభుత్వము అను వీనిచేత అధికుఁడైనవానిని, ఉద్దామ....భీము=భయంకరమైన యుద్ధభూమియందు భీముఁడైనవానిని, భీమ...వాటుక్=భయంకరమైన ప్రతాపము (అనెడి) అగ్నియొక్క దెట్టిదమైన సెగలచే మిక్కిలి నిర్మూలము సేయఁబడిన శత్రువగు పాండ్యరాజుయొక్క వారింపరాని గర్వమనెడి అడవుల సమూహముగలవానిని-శత్రువగు పాండ్యరాజు మహాగర్వమును తన ప్రతాపముచే నిర్మూలము చేసినవాఁడనుట, వారా...దుర్వారు = సూర్యుని యొక్క గొప్పప్రభవలె ప్రకాశించుచున్న మిక్కుటమైన బంగారముచేత వారింప రానివాఁడును-నిరతిశయుఁడైన వాఁడనుట. వారాశి...బాహు= సముద్రము చెలియలికట్టచే చుట్టఁబడిన భూమియొక్క భారమును దాల్చి యుండు ప్రకాశించుచున్న గొప్ప భుజముగలవాఁడు - భుజమునందు సమ

---

(1) ఈవాక్యమచ్చుప్రతులం దప్ప వ్రాఁతప్రతులందుఁ గానిపింపదు ; మఱి సరసమును గానందునఁ గవి రచితమనియుఁ దోఁపదు. అయిన నిందలి వాక్యములయాంత్యనియమమునుబట్టి యిది గయికొనఁబడినది.

భాసమానకరోరాసిధారా విచ్ఛిన్న సోమాన్వయోత్పన్న భూభృత్సమూహుఁడున్, సమూహా మహాశేముషీ కుంఠితాశేష శత్రుకుమారవల్లభుఁడున్, వల్లభామానసాదుర్గభుఁడున్, దుర్గ భారిక మానాథ మత్తేభయూథంబులం జూచి చెండాడు రాసింగముఁడున్, సింగభూపాలుఁ, భూపాల గోపాల గోపాలికా కృష్ణ గోపాలు, గోపాలదేవోత్సవ క్రీడలో, మేడలో నుండి జాలాంతరాళంబులన్ వారయోషాతనూజాత 2 విద్యావయోరూప సౌందర్యచాతుర్య విఖ్యాత చంచద్గుణోపేత 3 భృంగాంగ

---

ద్ర పరివృతమైన భూమండలమునెల్ల తాల్చిన వాఁడనుట, భాసా...సమూహుఁడు=చేతియందలి కటువైన కత్తి వాదరచేత మిక్కిలి చీల్చఁబడిన చంద్రవంశమునఁ బుట్టిన రాజుల సమూహము గలవాఁడు - సమూహా...వల్లభుఁడు - గొప్ప (మంత్రాలోచనపు) ఊహయొక్క గొప్పబుద్ధి కౌశలముచేత మొక్కపుచ్చఁబడిన సకల శత్రురాజులు గలవాఁడు - బుద్ధిబలముచేతను శత్రువుల నోర్చిన వాఁడనుట, వల్లభా...దుర్గభుఁడు=వల్లభల మనస్సులకు దుర్లభుఁడు గానివాఁడు దుర్గ...యూథంబులన్ = మదయరాని (గెలువరాని) రాజులనెడి మదపుటేనుగుల సమూహములను, భూపా...గోపాలుఁడు=రాజ సమూహమనెడు గొల్లపడఁతులకు కృష్ణగోపాలుఁడు, జాలాంతరాళంబులన్ = కిటికీల సందులందు, వారయోషాతనుజాత = భోగముదాని కూఁతురు - ఇదికర్తృ, పదము, 'చూచి' క్రియ, 'సింగభూపాలున్' కర్మ. భృంగా...సంకాశ = ఆఁడు తేఁటులచేత పొందఁబడిన వేఁడుకకైన చేతి తామరపూవునకు సాటియై.

---

1. అ. వల్లభామానసేచ్ఛాకలాదుర్లభుఁడు. 2. అ. విద్యానయోపేత సౌందర్య. 3. అ. క. భృంగాంగనాలబ్ధ కంజాత సంకాశ ; గ. భృంగాంగనాలుబ్ధకంజాతకేళీ మహాహస్త కంజాత; చ. భృంగాంగనాలబ్ధ కంజాతకేళీ మహాహస్త కంజాత సంకాశ ; జ. భృంగాంగనాలబ్ధ కంజాత సంజాతకేళీ మహాహస్త కంజాత.

నాలబ్ధకేశి మహాహస్త కంజాతసంకాశ, తూణీనిరుద్ధప్రసూ
నేషుసూనేషునీకాశ యై యుండి తద్వైభవంబుల్ విమర్శించి,

వేశ్యాకన్య రాజుం జూచి మోహించుట.

హర్షించి, సంతోషబాష్పాంబుపూరంబు వర్షించి, కందర్ప
బాణాహతిం జెంది, లోఁగుంద, మోహించి సంగంబునూహించి,
'యేవేళఁ దల్లిం బ్రమోషింతు, నేలీల భూపాలకుం జేరి భాషిం
తు, నేరీతిఁ గామానలంబుల్ నివారింతు, నేనాత్మపీడన్ విచా
రింతు, నేవెంట [1] రాచూలి వంచింతు, నేజంటఁ గోర్కుల్ [2] ప్రపం
చింతు మున్నీ ప్రశస్తారవిందంబనైనన్ మహీపాలు హస్తారవిం
దంబుపై నేఁడు లీలారవిందంబ నై యుందుఁ బో, రత్నహారంబ
నైనన్ శుభాకారు వక్షోవిహారంబుఁ గైకొందుఁ బో; యేల యి
ట్లైతి నెట్లోకదే' యంచు శంకించుచున్, నిత్యకల్యాణ లీలా

నది. కిటికి కంబముల సందుల నగపడుచున్న యాపడఁతి మొగము తుమ్మెదలు గ్రమ్మియుండఁగా నించించుక కనఁబడుచున్న తామరపూవునకు సాటియైనది. అనఁగా అట్టి తామరపూవువలె నుండెననుట. ఇట వట్టి 'కంజాత' మే చాలియున్నను ప్రతులు పెక్కింట 'కేళీమహాహస్త కంజాల' అనియున్నది. తూణీ...నీకాశ=పొదియందు అడఁపఁబడిన పూవిలుకాని (మన్మథుని) పూవుతూపునకు సాటియైనది - మన్మథుని యమ్ములపొదిలో నడఁగి కనఁబడుచున్న పుష్పబాణమువలె కిటికీలసందులలో అది చూపట్టుచుండె ననుట. 'కంజాత' యనుటచే మనోజ్ఞత్వమును 'సూనేషు' అనుటచే మోహనత్వమును సూచితములు. కందర్ప=మన్మథుని. ప్రమోషింతున్ = వంచింతును. లీలా...

1. అ. తోల్సారి. 2. అ. క. చ. జ. ప్రశంసింతు.

వతీ పంచబాణున్ మనోవీథి నంకించుచున్, ఘోషమాణాలికిన్ మందవాతూలికిన్ జంద్రమఃకీలికిన్ గోకిలారావదంభోలికిన్ చిత్తభూభల్లికిన్ దల్లికిన్ లోఁగి, కామానలజ్వాలలన్ వేఁగి, చింతాభరాక్రాంతయై [1] యోఁగి, [2] సంతాపఘూర్ణంబులందోఁగి, చింతించు నింతిం బరీక్షించి, [3] బుద్ధిన్ విచక్షించి, తన్మాత

వారకన్యతల్లి వచ్చి కూఁతునవస్థఁ గనుఁగొనుట.

మాయాపరాభూత జామాత మిథ్యానయోపేత విజ్ఞాతనానా వశీకారమంత్రౌషధవ్రాత లోకైకవిఖ్యాత వారాంగనాధర్మశిక్షాదిసంభూత సమ్మోహితానేక రాజన్యసంఘాత వాచాలతాబద్ధ నానామహాభూత యేతెంచి నీతిన్ విచారించి, బాలన్ [4] మిళత్కుంతలవ్రాత ఫాలన్ గరాంభోజ రాజత్కపోలన్

బాణున్=స్త్రీలకు మన్మథుఁడైనవానిని, ఘోషమాణ అలికిన్=మ్రోఁగుచున్న తుమ్మెదకు, మందవాతూలికిన్=మెల్లనిగాలికి, చంద్రమః కీలికిన్=చంద్రుఁడనెడి అగ్నికి - చంద్రకిరణములు విరహిణులకు సెగలవలె వేఁడిగానుండుటచే చంద్రుని అగ్నిగాఁ జెప్పుట. కోకిల ఆరావ దంభోలికిన్=కోకిలలరవళి యనెడి వజ్రమునకు - వజ్రాయుధమువలె దుస్సహమైన వానిరవళి యనుట. చిత్తభూభల్లికిన్=మన్మథుని బల్లెమైనదానికి. ఇది తల్లికి విశేషణము. తన్మాత=ఆ వేశ్యకన్యతల్లి, మాయా...మాత=మాయచేత కీడ్పఱుపఁబడిన (వశీకృతులైన) అల్లుండ్లుగలది. విజ్ఞాత=తెలిసిన, వ్రాత=సమూహము, వాచాల...భూత=మాటకారితనముచేత కట్టుపఱుపఁబడిన పెక్కు మహాభూతములు గలది- పెనుభూతములను సైతము మాటచేత కట్టుపఱుచునట్టి దిట్ట యనుట, మిళత్...ఫాలన్=(వారకన్యావర్ణనము) గూడికొనుచున్న ముంగురుల గుంపులుగల నుదురు గలది. కరా...

1. అ. క్రాఁగి, 2. ఇది. అ. గ. చ. జ. లందు లేదు. 3. ఇది. 'జ' యందు మాత్రమున్నది. 4. అ. గళత్కుంతల.

సమందోష్ణనిశ్వాసజాలన్ విపర్యస్తసంవ్యానచేలన్ మహాం
దోల, అప్రేంఖితస్వర్ణడోలన్, మృగేంద్రావలగ్నన్, దయా
వ్యాప్తిమగ్నన్, మనోజాగ్నిభగ్నన్, నిరంధన్, పరిత్రస్త ధమ్మిల్ల
బంధన్ 1 సముద్వ్యగ్న మోహానుబంధన్ నిరాలాప నావ
జ్ఞాతాలేప నస్వీకృతానేక కేయూరహారన్ గళద్బాష్పధారన్
పరిత్యక్తలాస్యన్ పరాభూత లీలావయస్యన్ పదాలేఖనా
లక్షితక్షోణిభాగన్ పరిక్షీణ 2 రాగన్ విలోకించి, బుద్ధిన్
వివేకించి, లోనం బరాయత్తయై, చిత్తజాతాసి ధారాచలచ్చిత్త

లోలన్=తామరవంటి చేతిచేత ప్రాపించుచున్న చెక్కిలి గలది - వగపుచే చెక్కిటఁ జేతి నిడుకొన్నదనుట. సమం...జాలన్ = ఇంచుక వెచ్చనయిన ఊర్పుల సమూహము గలది. విప...చేలన్=తాఱుమాఱయిన పయంటగలది. అప్రేం..డోలన్=ఆడింపఁబడని బంగారుటుయ్యేలగలది-ఆయుయ్యేల నూఁగని దనుట. మృగేంద్ర అవలగ్నన్=సింగముం బోలిన నడుము గలది. మనోజాగ్ని=మరులనెడి యగ్ని, పరి...బంధన్=మిక్కిలి జారిన కొప్పుముడి గలది. నిరంధన్=అన్నము లేనిది - భోజనము సేయకుండున దనుట. ఇది సుధాంధశ్శబ్దమువంటిది. సము...బంధన్ = మిక్కిలి అతిశయించిన మోహంపు ఎడతెగని వరుసగలది. మోహము నెడతెగక పయిపయిని పెరిఁగి వేధించుచున్న దనుట. నిరాలాప=మాటలాడుట లేనిది, నా...లేప=మైపూఁత లేనిది-పూసికొననిది. నస్వీ...హారన్=కైకొనఁబడని పెక్కులు బాహుపురులును హారములును గలది- పరిత్యక్తలాస్యన్=విడువఁబడిన నర్తనము గలది. పరాభూత... కీడ్పఱుపబడిన (తిరస్కరింపఁబడిన) చెలికత్తెలు గలది. పద...భాగన్ = కాలి (బొటనవ్రేలి) వ్రాఁతచేత గుర్తింపఁబడిన భూతలముగలది- నేల బొటనవ్రేల వ్రాయుచున్న దనుట. లోనన్...యత్త = మనస్సునందు పరవశయై, చిత్త...చిత్త=మన్మథుని కత్తివాదఱుచే వడఁకుచున్న మనస్సుగలది. రిత్త

1. ఇది వ్రా. ప్ర. లందు లేదు. 2. అ. భోగన్.

న్నమై, విన్నమై ఖిన్నమై, యున్న భావంబు భావించి, నెయ్యంబు

తల్లి కూఁతునకుఁ గులవృత్తి ధర్మములను బోధించి
రాజుపై వలపును వారింపఁజూచుట.

గావించి, రావించి 1 'బాలా! జనత్వంబు మేలా, వినోదింప వేలా, విచారింప నేలా, వివేకింప కేలా 2 వయోధర్మముల్ రిత్తగాఁ బుచ్చునీ వృత్తికిన్ మెత్తురే. వత్తురే 3 కాముకుల్ డాయఁ, గాయంబు విద్యున్నికాయోపమేయంబు హేయంబు ప్రాయంబు ధారాధరచ్ఛాయ మెచ్చన్ ఉపాయంబులన్ విత్తమాయత్తముం జేయుమా. 4 రిత్తవారంబు నేరంబుగా దీపిచారంబు వంశానుచారంబు, సంసారసారంబు, లాభాధికారంబు, చర్చింప నీకున్నలంకారమే కాన ధిక్కారముం జేయగా దీ విచారంబు

గాన్ = వ్యర్థముగా, ఈ వృత్తికిన్ = ఈ నడవడికి, కాయంబు = దేహము, విద్యున్నికాయ ఉపమేయంబు = మెఱుపుల సమూహమునకు ఉపమేయమైనది - మిక్కిలి అస్థిరమైనదనుట. ప్రాయంబు = వయస్సు, ధారాధరచ్ఛాయము = మబ్బుల నీడ వంటిది. దీపిచారంబు = ఎన్ని ఉపాయములచేతనైన ధనము గడింపవలయు నను చింత, రిత్తవారంబు = కేవలము భోగము తెనము. 'వారస్త్రీ' అనుచో 'వార' శబ్దము సమూహవాచకముగా వ్యుత్పత్తి అయినను కవి మొదటియర్థమునకే యిందుంచియున్నాఁడు. వంశానుచారంబు = భోగము వంశము ననుసరించినది. వారికి కులధర్మమైనదనుట. లాభాధికారంబు = ధనలాభము సంపాది

1. అ. విచారింప వేలా, విలోకింపు బేలా. 2. అ. వయోరూప సౌందర్యముల్ రిత్తగాఁ జేయు నీవృత్తికిన్ మెత్తురే. 3. అ. కాముకుల్ చొత్తురే డాయ. 4. అ. రిత్తవారంబు లాభంబు లాభంబె లాభానకుం గారణంబైన నా మాట నేరంబె నేరంబుగాదే విచారంబు. ఈ పాఠము వ్రా. ప్ర. లందొక్కటను లేదు. 5. అ. నీబోఁటికిన్ బట్టలంకారమే కాని. ఇదియు వ్రాఁతప్రతులందు లేదు. క్రమమున కచ్చుతోడి ద్విత్వము పోతన కభిమతము.

లేలే, శుభాకార యేలే, గుణోదార యేలే, కులోద్ధార యేలే, తటిద్దేహ యేలే, వరారోహ యేలే, లలాటాలకవ్యూహ యేలే, మహోత్సాహ యేలే, విరాజన్ముఖాంభోజ యేలే, మహోరోజ యేలే, కలాలాప యేలే, జగన్మోహనస్రూప యేలే, చలచ్చంచలాలోకనవ్రాత యేలే, నయోపేత యేలే, మహామర్మచ్ఛదంబులై సుప్రసాదంబులై *కౌముదీమూలకందంబులై మందమందంబులై, చూడ నందంబులై, మోహనశ్రీవిలాసంబులై యున్న నీచారుహాసంబులన్ బోలి యోలిన్ భుజంగాలి బాళిం బఱందార్చుటో; కాక, లోలంబులై, మోహజాలంబులై కాముబాణంబులై, యప్రమాణంబులై, మీనశోభంబులై, చంచలాభంబులై, మోహితాశేషలోకంబులై యొప్పు లీలావలోకంబులన్ ప్రౌఢలోకంబులన్ సద్వివేకంబులం బాపి తాపాతిరేకంబులం గూర్చుటో; [1] కాక, రాజత్త్రిలోకీవశీకార మంత్రంబు

---

పుగానికిఁగలది. తటిత్ దేహ = మెఱుపుఁదీఁగవంటి దేహము గలదానా, లలాట అలక వ్యూహ=నొసటియందలి ముంగురుల సమూహము గలదానా. కలాలాప= మధురమైన మాటలు గలదానా. చలత్...వ్రాత=బెళుకులై మెఱుపులవంటి చూపులగుంపుగలదానా.

* ఇది మందహాసవర్ణనము. కౌముదీ...కందంబులై = వెన్నెలకు మూలదుంపలై - వానివలెఁ దెల్లనివనుట. మోహ...లాసంబులై = మోహింపఁజేయు సొంపుయొక్క విలాసములు గలవై. భుజంగ ఆలిన్ = విటసమూహమును. (చూపులు) మీనశోభంబులు = చేఁపల చెలువుగలవి, చంచలాభంబులు = మెఱుపులంబోలినవి. (ఆలాపములు) ఉల్ల...త్రములు=ప్రకాశించుచున్న మన్మథోపాయములు గలవి. దర్ప...యంత్రంబులు=మన్మథుని మేటిజంత్రములయినవి.

---

1. అచ్చుప్రతులందు స్తనవర్ణనము ముందును, ఆలాపవర్ణనము పిదపను నున్నవి.

లై, యుల్లసత్కామతంత్రంబులై, దర్పకోద్రేక యంత్రంబులై, మోహవారాశి భంగంబులై, సూచితానేక నర్మప్రసంగంబులై, కామకేళీకలాపంబులై, యొప్పు నీభాసమానానులాపంబులన్ విత్తవల్లోక చిత్తంబులన్ రాగమత్తంబులం జేసి తత్తన్నిమిత్తంబులన్ నిత్యమున్ విత్తమెల్లం బ్రమోషించి దూషించి భర్జించి తర్జించుటో; కాక, తోరంబులై, మధ్యభారంబులై, నిర్జితానంగ సౌధోపరి స్వర్ణకుంభంబులై యొప్పు నీ విప్రవక్షోజకుంభంబులం జూపి పౌరావళిన్ నర్మలీలా కురంగావళిం జేసి నిర్జించి వర్జించుటో; కాక, నీ కీ కులాచారముల్ మాననే కీరసల్లాప బోధించెనో! నేడు నాతోడు నాతోడ నాతోడ

---

మోహవారాశిభంగంబులు=మోహసముద్రమందలి అలలు - మోహము పొంగి పొరలి అలలుగొట్టుచున్నట్లున్నవి యనుట. కలాపములు = సమూహములు. భాసమాన=ఒప్పుచున్న, విత్తవల్లోక=ధనికులసమూహముల, (స్తనములు) మధ్యభారంబులై =నడుమునకు బరువులై - నడుము మిక్కిలి సన్నది గాన బలువైన చన్నులగవ దానికి భార మనుట. నిర్జి...కుంభంబులై =గెలువఁబడిన మన్మథుని 'మేడమీఁది బంగారుకుండలు గలవై'-సంపన్నులగు ప్రభువులు మేడల మీఁద బంగారు కలశములుంచుట ప్రసిద్ధము. మన్మథుని మేడలపైని బంగారు కుంభములను గెలిచిన వనుట. బంగారుకుంభము లనుటచే-వానివలె బటువులై బంగారుచాయఁ దొలఁకు వనియు మన్మథుని మేడయందలి వనుటచే అత్యంత మోహోద్దీపకము లయినవనియు భావము. విప్ర=వెడలుపైన, వక్షోజకుంభంబులు=చనుకుండలు, పౌరావళిన్=పురజనుల సమూహములను, నర్మ...వళిన్= నర్మముల లీలలకు జింకలగుంపులుగా - జింకనుబోలె బేలుపుచ్చి, కీరసల్లాప= చిలుకపలుకుగలది-ఇట స్త్రీసామాన్యపరము. నాతోడు=నామీఁది ఒట్టు. ఇది తనతో మాటాడుటకై శపథము. 'నాకన్నుల యాన నావలపుఁగస్తురినామము

మాటాడుమా. చూడుమా కన్యకాలోక చింతామణీ, గోత్రరత్నామణీ, ధీమణీ, ఎవ్వ రెవ్వాని భూషించిరే, ఏమి భాషించిరే, నేఁడు నీతోడ భాషించు ప్రౌఢల్ కుమారీ! కుమారాన్నపోతానసీనాథ సూనుల్ వధూచిత్త విత్తాపహారావధానుల్ సదాదాన విద్యావిరూఢుల్ మనోజాత హృద్యానవద్యైక విద్యావలీఢుల్ ప్రభాభాను, రాగానుసంధాను, మాయారమానాథు సర్వజ్ఞసింగక్షమానాథు నీసన్నిధానంబునం జెప్పిరో, ఏమి వాతప్పిరో, అప్పరో, అప్పయోజాత గంధుల్ [1] సుగంధుల్. పురుల్ నీవయస్యల్ మహాసౌమనస్యల్ సువర్ణా, సువర్ణంబు లార్జించుటల్ చూడవా. చూడ వాంఛింతురా రాజులన్. వారలా రాజులం గానరా. రాజుఁ గామింర

తోడు' (విజయవిలాసము) ఎవ్వరు...భూషించిరే = ఏసంస్థానమందు ఏమనుష్యులనుగూర్చి నీతో పొగడిచెప్పిరే. ప్రౌఢల్ = ప్రౌఢలగువారు, కుమారా... సూనుల్ = కుమారాన్నపోతరాజు కుమారులు, వధూ...ధానుల్ = స్త్రీలమనస్సనెడి ధనమును అపహరించుటయందు ఎచ్చరికగలవారు. మనో...లీఢుల్ = మన్మథునియొక్క మనోహరమై నిర్దోషమై ముఖ్యమైన విద్యయందు-అనఁగా మోహనవిద్యయందు మున్గఁడైనవానిని-మన్మథునివలె మిక్కిలియు మోహింపఁజేయువాని యనుట, ప్రభాభానుల్ = తేజమునందు సూర్యుఁడైనవానిని, మాయారమానాథుల్ = మాయలయందు విష్ణువైనవానిని, నీవయస్యల్ = నీచెలికత్తెలు, సువర్ణంబులు=బంగారములను

రాజుల్ కామింతురా = రాజునే కోరరాదు, మఱి రాజులకు రాజైనవానిని కోరుటకాని అందును వంచించుటగాని తలంపవలెనని చెల్లునా యనుట.

1. అ. సదాసత్యసంధుల్. 2. అ. మాడ వాంఛింతురే రాజుఁ గాం

ధురా, రాజబింబాననా! [1] రాజరాజాధి రాజోన్నతిన్ రాజులన్ మించి రాజిల్లునారాజు వంచింప నెంచంగ శోభిల్లునే, [2] చెల్లునే, భూమి నీజాతి యేనాతి యీరీతిఁ బ్రీతిం బ్రకాశించి రాజిల్లునే. చెల్లదే నీపటుత్వంబు [3] వాచా కటుత్వంబు, బాలేందు శోభాలికా! బాలికల్ సేయు యత్నంబులే నీ ప్రయత్నంబు? అంభోజనాళాంతరాళ స్ఫురత్తంతుయోగంబునం జిక్కునే గంధనాగంబు? కంపించునే మక్షికాపక్ష విక్షేప వాతాహతిం గాంచనాగంబు? మిథ్యామమత్వంబులన్ రంజకత్వంబులన్ గూఢ యంత్రంబులన్ మోహ మంత్రంబులన్ మారు తంత్రంబులన్

వాచాకటుత్వంబు = మాటలచేతఁ గటువగుట. బాలేందు...బాలికా = లేఁత చందురునిశోభ గల నుదురు గలదానా, గంధనాగంబు = మదపుటేనుఁగు, అంభోజ...చిక్కునే = తామరతూఁటిలోనఁ బ్రకాశించుచున్న పోఁగులకూడిక చేత - తూఁటిపోఁగులచేత - కట్టుటకు చిక్కునా. కాంచన అగంబు = బంగారుకొండ - మేరుగిరి. మక్షికా...హతిన్ కంపించునే = దోమల ఱెక్క

క్షింతురే యింత చింతింతురేరాజబింబాననా. క. చూడ వాంఛింతురా రాజులం గానరా రాజుఁ గామింతురా...చ. చూడ వాంఛింతురా వార లారాజులం గానరా రాజుఁగామింతురా ... జ. చూడ వాంఛింతురా రాజులన్ వార లారాజులుం గానరా రాజుఁగామించిరా.

1.క.రాజా...న్నతిన్ రాజులన్ మించి వంచించిశోభిల్లునే. జ. రాజ ....న్నతిన్ బోల్చు రాజన్యులన్ మించి రాజిల్లునే. 2. అ. భూమి నేనాతి నీరీతి నీతిం బ్రకాశించునంచున్ విలోకించి రాజిల్లునే; క. భూమి యేజాతి యేనాతి యేరీతి నీతిం బ్రకాశింప కీభంగి రాజిల్లునే;చ. భూమి నేనాతిచే విట్టి వీజాతి నీరీతిఁ బ్రీతిం బ్రకాశించునంచున్ వివేకించి రాజిల్లునో. 3. 'వాచాకటుత్వంబు' ఇది వ్రా. ప్రతులలేదు.

జిక్కఁడే. చొక్కఁడే దిక్కులం జిక్కులం బెట్టు 1 మేధన్ మహావేధనైనన్ 2 విరోధించి వాకట్టు, నీతిన్ బలారాతిమంత్రిం బ్రమోహించు, భాషావిశేషంబులన్ శేషుతోనైన భాషించు, మాయావిధానంబులన్ మాధవున్ మెచ్చఁ, డచ్చోట నెప్పాట మెప్పించెదే. చీటికిన్ మాటికిన్ బోటి యామేటి యిచ్చోటికిన్ రాఁడు పాటించి. నీ పాటిపాఠీననేత్రల్ ధరిత్రీశుచిత్తంబు 3 మత్తంబుగాఁ జేయఁగాఁ జాలరే. ఏల రేలుంబగళ్లున్ 4 విచారంబు? చాలింపవే. వారవేశ్యాభుజంగుండు గాఁడే; మహారాయవేశ్యాభుజంగుండు నిన్నేలయేలున్? పరస్త్రీలకున్ వేళ యీఁడెన్నఁడున్. 5 దత్తుఁ బాంచాలు భద్రున్ మరుం గూచిమారున్ వినం గోరవుం జీరవుం జేర వీరీతి నేనాతిచే వింటివే యింటి నీవంటి దీవెంటలం దంటవై 6 గెంటిపోఁ? దమ్మికంటీ, నినుం గంట యీ వెంటకా?

---

ల్లార్పువలనిగాలి కొట్టుటచేత కదలునా. చిక్కఁడే = ఆరాజు పట్టువడనే పడఁడు. చొక్కఁడే = చొక్కనే చొక్కఁడు, మేధన్ = బుద్ధిచేత, మహావేధనైనన్ = మహాబ్రహ్మనైనను, విరోధించి = పగవూని - పగవూనినచో, వాకట్టు. నీతిన్ = నీతిచేత, బలారాతిమంత్రిన్ = బృహస్పతిని, ప్రమోహించున్ = వంచించును. దత్తున్, పాంచాలున్, భద్రున్, మరున్, కూచిమారున్ - వీరు నాయకభేదములు.

ఏనాతిచే... గెంటిపోన్ = నీవంటిది యిట్టిపూనికలనుగొని దిట్టతనముతో పుట్టినింటిని ద్రోచి మఱియొకచోటికిఁ బోవుట నెవతిచే వింటివి - నీవంటిదానికడకు వెఱవారు రావలెనే కాని నీవై పోవుట తగదనుట. గొంటు

---

1. అ. వేధన్. క. వేధల్. 2. క. వివాదించి. జ. నిరోధించి. 3. గ. చ. మొత్తంబుగా. 4. అ. విచారింప. 5. వచ్చు పాంచాలు. 6. అ. గెంటిపోఁ జూచునే తమ్మికంటీ నినుం గంటి నాహా కనుంగొంటి; గ. చ. జ. గెంటి.

హా! కనుంగొంటి నీగొంటు చెయ్దంబు. దైవంబు క్రేఁగంటి కే నెంత కంటైతినో! జంట నింటింటికిన్ వెంటవెంటం బడన్ బంటు నే? దాఁట నింటిన్, జెనంటీ! చిరంటీ గుణం బేటికే? మాయ లాఁడే విభుం డైనఁ బోఁడే వినోదింప నీఁడే నిమగ్నుండు గాఁడే మముం జేరనీఁడే నినుం జేరరాఁడే ప్రవేశింపరాదే ప్రమోహింపఁగాదే. ప్రవర్తింతు వెచ్చోట నచ్చోటి కేమేఁ బ్రియం బాడ రామే నినుం బాయ లేమే. మహోపాయవై కన్యకా! ధన్య నన్యన్ మదిం గోరుమా, చేరుమా. చేరుమా కిష్టముల్. వీట లేరే మగల్, చేర రారే నినుం గోరి తారే [2]విహారేహులై గేహళీవాటికిన్ మాటికిన్. వచ్చు నేవారి నీవారిఁగాఁ జూడవున్ గూడవున్. వారిజామోద! యీవార రామల్ మనోరాముల న్కృత్తిపోరాములంగాని నిక్కంపుఁ [3]బోరాములం జేసి గారాము

---

చెయ్దంబు=దుడుకుచేష్ట, కంటుఐతినో = పగయైతినో, వెంటవెంటంబడన్ = అనుసరించి పోవుటకు, బంట నే= సేవకురాలినా, దాఁటనింటిన్=ఇంటికడప నే దాఁటి యెఱుఁగను - ఇఁక నీకై దాఁటి వత్తునాయనుట. విభుండైనన్ = సింగభూపాలుఁడు నీకు భర్తయయ్యెనేని, పోఁడే = నిన్ను విడిచిపోవఁడు, వినోదింపనీఁడే = నిన్ను క్రీడించునట్లు చేయనీయఁడు, నిమగ్నుండుగాఁడే = మా మాయలందు మునుఁగఁడు. ప్రవేశింపరాదే=నీవున్నచోటును మాకుఁ జొర నలవిగాదు. ప్రవ...రామే=నీవున్నచోటికి ఈచోటివలెనే నీతోడ ఏమేని ప్రియములాడుటకు రాఁజాలము. వీట...విహారేహులై=మన పట్టణమందుఁ గల పురుషులు నీతోఁ గ్రీడింపగోరి తమంటనే నీయింటి వాకిటికి పలుమాఱు రారా. వారిజామోద=తామరవంటి వాసన గలదానా. ఈవార రామల్=ఈబోగము

---

పోఁ దమ్మికంటీ నినుంగంటి నీ వెంటకా? హా కనుంగొంటి. 2. క. విహారేహవై. 3 అ. గారాములం జేసి రారాపులంజిక్కి రే.

లం జిక్కి రే. చొక్కి రే. [1] వారు వారాదికృత్యంబులం జేయ వారక్రియల్ చెల్లవే. తల్లిరాజుల్ బహువ్యాజులే [2] భోజులే చంచలచ్చిత్తులే మత్తులే ప్రేరకాయత్తులే నూతనాసక్తులే లోభసంయుక్తులే దోషసంసిక్తులే రంధ్రసంపాదులే వీతమర్యాదులే. వారి సేవింపఁగా రాదులే, కాదులే, వాదులేలా, నవైలాలతాదేహా! సందేహమే దేహమే లేనలంపన్, నిలింపాంగనాభా! సునాభా! మదిన్ మానవే మానవేశాభిలాషంబులన్. నిన్ను లేమా! భరింపంగలేమా? కరంగింప లేమా [3] నరేశున్ జితశ్రీ

---

పడుచులు, రిత్త పోరాములన్ = వట్టి కూరుములచేత నే, నిక్కంపు పోరాములన్ = యథార్థమైన ప్రేమలను, గారాములన్ = తమవలచినవారలందు-వారలకనుట. వారాదికృత్యంబులన్ = బోగముతనము మొదలైనకార్యములను, రంధ్రసంపాదులే = తప్పులు కలిగించువారే. పోరామి = చెలిమి, నవఏలాలతాదేహ = క్రొత్త ఏలకితీఁగవంటిదేహముగలదానా, నిలింపాంగనాభా = దేవతాస్త్రీకిసాటియైనదానా. మానవేశ అభిలాషంబులన్ = రాజునందలి కోరికలను. జితశ్రీసురేశున్ = గెలు

---

1. క. వీరు వారానివారాది కృత్యంబులం జెల్లువార క్రియల్ చెల్లవే. చ. వీరు వారానివారాధికృత్యంబులం బేరువారా క్రియల్ చెల్లుటల్ మానవే. జ. వారకారాధి కృత్యంబులం జేయు వారక్రియల్ చెల్లవే; ట. వారు పోరాని కృత్యంబులన్ జేయువారాక్రియల్ చెల్లవే. ఠ. వారాతి కృ... వారక్రియల్; థ. వాకు వారాధి కృ... వార క్రియల్. 2. ఇది. వ్రా. ప్ర. లేదు. 3. అ. నరేశున్ రతస్త్రీజితోద్దండ చండాహితా ఖర్వగర్వాంధ వేదండగండ స్థలీఖండితారాతి దండంబు గండంబుగా నుండు నమ్మండలేశున్ విరాజన్ముఖాంభోజు నాభోగినీరాజుతో నోజతో నీకుఁ బొత్తుండఁగాఁ బోలునే. నీకు మాదండనే దండముల్ జెల్లదే. చెల్లునే రాచదండంబు గండంపు దండంబుగా నిత్తుకో దండ విభ్రాజిత' ఇది వ్రాఁత ప్రతుల లేదు. అర్థసంగతియు నిందుఁగలుగదు.

సురేశుని. గతిశ్రీజితోద్దండ వేదండ! మాదండ నేదండమున్ జెందదే. రాచదండంబు గండంబు పుండ్రేక్షుకోదండవిభ్రాజిత భ్రూయుగా! భూమిపాలావరోధంబు [1]లో సన్నిరోధంబు నీకున్ మహాభద్రమా? భద్రమాతంగకుంభస్తనీ! [2] కన్నవారంబుగా మాహితాదేశముల్ సేయఁగా మాకు ధర్మంబు. కామాశుగాలోకనా! ఏల కామాతురత్వంబునుం జెంద, రామా! [3]భవత్సంగతిన్ మున్నుగామా, త్రిలోకాభిరామాంబరానేకహేమాదు

వఁబడిన శ్రీదేవేంద్రుఁడు గలవానిని - అట్టి మహాసంపన్నుని మనకు కరఁగించుట మిక్కిలియు కష్టమనుట. గతిశ్రీ...వేదండ=గమన సంపదచే (నడక పెంపుచే) గెలువఁబడిన మదపుటేనుఁగు గలదానా-మదపు టేనుఁగునడను గెలిచిన నడగలదానా యనుట. మాదండ...గండంబు=మాయొద్ద ఏదండమును అనఁగా ఆజ్ఞ మొదలగునవి గలుగదు; రాజులవలని దండమో గండముసుమీ-వారియొద్ద అడఁగి మడఁగి వెఱచుచు నుండవలయును; మాయొద్ద విచ్చలవిడిగా నేయడ్డులేక యుండవచ్చుననుట. ఇందు అచ్చుప్రతుల పాఠము అసంగతమును అతిదుష్టమును.

పుండ్రేక్షు...యుగా = చెఱకు విలువలె ప్రకాశించు బొమలజంట గలదానా, భూమిపాలా...సన్నిరోధంబు = రాజాంతఃపురములో అడఁపఁబడి యుండుట. భద్ర...స్తనీ=భద్రగజముయొక్క కుంభములవంటి చన్నులుగలదానా. కన్నవారంబు...ధర్మంబు = నిన్నుఁగన్నట్టి బోగము వారముగాన హితములను ఆజ్ఞాపించుట మాకు ధర్మము. కామా...కనా = మరుతూపుల వంటి చూపులదానా. త్రిలోక...హేమాదులు = ముల్లోకములందు మిక్కిలి

1. అ. భూమిపాలావరోధంబులేలా నిరోధంబు నీకున్. 2. అ. కన్నవారన్న యాదేశముల్ సేయఁగా నీకు ధర్మంబె; గ.నీకు న్నవారంబుగా మాహితాదేశముల్ సేయఁగా మాకు ధర్మంబు. 3. ఇది. వ్రా. ప్ర. ల లేదు.

లున్ నీకు నీమా. కులోత్తంస! నే మాకులత్వంబునుం బొంద మా
మాట లేపాట వేమాటు లాలింపువారిన్ నిరీక్షింప కీమానవా
ధీశుపై మానసం బేల పట్టించెదే. ముద్దుపట్టీ, భవచ్చాతురిం బట్టి
సర్వజ్ఞ సింగక్షమా నాథుఁ దప్పించి దర్పించి లోకత్రయిన్ నీకు
నర్పింతునే. మారునిం జారుఁ గావించి రప్పింతునే. బ్రాఁతియే
పైఁడి? నాపైఁడి ! ఏపైఁడి లేదింటిలో? వింటివా రాచపో
రామి యిట్టట్టుఁ బోరామికిన్ మూలమే. మేలమే? [1] ఇందు
నవ్యారవిందాననా! ముందు విన్నాననే లాట కర్ణాట పాం
చాల బంగాళ చోళాది రాజన్య కన్యల్ వయోరూప ధన్యల్
సదాసక్తలై దాసి యున్నారటే. రారటే పాసి. తత్పాదరాజీ
వసందర్శ నారంభ సంరంభులై వీతహృద్దంభులై కుంభినీశుల్
బహూపాయనద్రవ్యహస్తుల్ [2] ప్రశస్తుల్ మహాభక్తి నక్తందివా

---

యొప్పిదములయిన వస్త్రములు మేలయినమైపూఁతలు బంగారు మొదలగు వానిని, ఈమా=ఇయ్యమా, బ్రాఁతియేపైఁడి=బంగారు తక్కువా, నాపైఁడి=నాబంగారూ, ఏపైఁడి=ఏబంగారు, రాచపోరామి=రాజునందలి మక్కువ, ఇట్టట్టు పోరామికిన్=తలఁచినయింటికిఁ బోరాకుండుటకు, మూలము=కారణము-తలఁచిన యిండ్లకు బోను వలనుపడదనుట. ఇందు...ననా=చంద్రునివలె క్రొత్తతామరవలె నున్న మొగముగలదానా, విన్నాననే = ముందు వినియున్నాను - లాట దేశాదుల రాజకన్యలు రాజును వరింపఁ గదిసియున్నారని వినియున్నాననుట. రారటేపాసి=ఆకన్యలురాజును విడిచి రారఁట - అనఁగా నీకు నవకాశము కలుగ నీయరనుట. వీతహృత్ దంభులై=మనస్సునందలి గర్వమును విడిచినవారై, కుంభినీశుల్=రాజులు, బహు ఉపాయన...స్తుల్ = పెక్కుకానుకపదార్థములు గల చేతులుగలవారు. నక్తం దివంబుల్ = రేయుంబవళ్లు,

---

1. అ. ఇంత రవ్వేలనే యిందునవ్యారవిందాననా. 2. క. సురూప ప్రశస్తుల్.

బుల్ ప్రవేశించియున్నారు. కన్నారు విన్నారు లోకుల్. వరా
లోక నీ కేల లీలావకాశంబు సిద్ధించు? సిద్ధించెనా మన్మథాకా
రుతోఁ గూడి క్రీడింపఁగాఁ [1]బోలదే. వానివాణికి మహావాణి
కాఁపున్నదే. మన్నదే రత్నగర్భంబుతో భూమి తద్బాహుపీఠికిన్.
దిశాకుంభి కుంభీన సాగేంద్ర కూర్మాకులం బాసి కూర్మిన్ విలో
కంబులన్ లచ్చి వర్తించునే. దిక్కులం దెల్లఁ గీర్తుల్ ప్రవర్తించు
నే. దుర్లభుండే! బహుప్రేయసీవల్లభుండే! [2]సదైకానుషంగం
బు భంగంబు పణ్యాంగనాజాతికిన్. నీతికిం దప్పి తేఁ జెప్పితిం గూన!
సిద్ధంబు తద్ధాత మున్ వారభామాతనూజాతకున్ నేతగా మాత
నుజ్జాత గావించె. [3]నిర్ణీతమే యేతదర్థంబు మర్యాద [4]నిమ్మేదినిన్

కన్నా...లోకుల్=జనులెల్ల దీనిని కని వినియున్నారు. లాటాది రాజకన్యలు
కదిసియున్నారు. నానారాజులు వేచియున్నారు. కనుక నీకవకాశము గలు
గదు. ఒకవేళఁ గలిగినను ఆరాజు నొద్దనే, వాణి, భూమి, లక్ష్మి, కీర్తి యను
కాంతలున్నారు కాన నీ కవకాశ ప్రసక్తియె కలుగదనుచున్నది. దిశా...
దులన్=దిగ్గజములు ఆదిశేషుఁడు కులపర్వతములు ఆదికూర్మము మొదలగు
వానిని, ఆలోకంబులన్=చూపులందు. వాణిని వాక్కునను, భూమిని బాహువు
లందు,లక్ష్మిని చూపులందును, కీర్తిని దిక్కులందును జెప్పుట ప్రకటము. ప్రేయ
సీ=ప్రియురాండ్రు, సదా ఏక అనుషంగంబు=ఎప్పుడును ఒక్కనితోనే కూడి
యుండుట. పణ్యాంగనాజాతికిన్=భోగము కులమునకు, భంగంబు=చెఱుపు,
తత్ ధాత...=ఆబ్రహ్మ భోగముదాని కూఁతునకు భర్తగా తల్లిని పుట్టి
నదానిని జేసినాఁడు. నేత్రి యనుటకు నేత యని మహద్వివక్ష. నేతృ సాదృ

1. అ. బోలదే పోలినన్ వాని వాణిన్. 2. క. తదేకానుషంగంబు.
3. అ. గ. నిర్ణేతదై. 4. అ. నీమీఁద నున్మాదమే నాదిమై నుండి లేదా
ప్రయోగింపఁగాఁ గామశాస్త్రి. క.మీమేదినీ వాదమే మాదినుండిన్ బ్రయో
గింతు నేవాది నే; గ. గా మేదినిన్...గింతు నేవాదినై; చ.నీవేది నీవాదమే

వారమే నాదినుండిం బ్రయోగింతు నే దాదినై. కామశాస్త్రాది విద్యాసమేతన్ భవన్మాత నుద్దామమాయాప్రభూతన్ గురంగీ విలోకా నిరంగీకృతుల్ మాని నామాట నీమాటు పాటింపవే. నందనీ! నిందనీయంబు గాదే. మహానందనీయంబుఁ జిత్తంబు లోనందనీవే. జనానందనీయా! కఠోరాచలవ్రాత కాఠిన్యముల్ డింప, రత్నాకరశ్రేణిలోఁతుల్ నివేదింప, విత్తేశుగేహంబు నుల్ రిత్తసేయన్, జగచ్చక్షువుం గన్నుమూయన్, సదాగామి నాఁకట్టనుద్యద్భుజంగావలింబట్ట, వారాంగనాజాతికిన్ న్యాయ

శ్యవివక్షాపరము. నిర్ణీత...దాదినై =ఈవిషయము బ్రహ్మచేత నిష్కర్షింపఁబడి నదికాన భూమియం దీభోగముతనమును నేను మొదటినుండియు ప్రయోగిం చుచున్నాను. ఉద్దా...భూతన్=బెట్టిదమైన మాయలచేత అధికురాలైన దానను-తల్లి యిట తన యతిశయమును చెప్పుకొనుట కూఁతురు తన్ను నలక్ష్య పెట్టకుండుటకై, కురంగీవిలోకా=ఆఁడుజింక చూపులదానా! నిరం...తుల్ = అంగీకారము లేకపోవుటలను, నిందనీయంబు = (నామాట) నిందింపఁదగినది. కఠోరా...డింపన్ = గడుసైన కొండలసమూహములయొక్క కఠినత్వమును తీసివైచుటకు-అంతటి కఠినుల మనసులనైనను కరఁగించుట కనుట. రత్నాకర శ్రేణిలోఁతుల్ నివేదింపన్=సముద్ర సమూహములోఁతును తెలుపుటకు- అంతటి గంభీరులగు వారినుండి లోనిభావమర్మములను వెలువఱుచుట కనుట. విత్తేశు...సేయన్ = కుబేరుని గృహమునైనను శూన్యము గావింపఁగా - అంతటి ధనికులనైను కడు దరిద్రులను గావించుట కనుట, జగచ్చక్షువున్ కన్నుమూయన్=సూర్యునినైతము కన్నుఁ బ్రామూటకనుట. ఇట జగచ్చక్షు పదము సాభిప్రాయము. లోకమునకెల్ల కన్నయిన వానినే కనుఁబ్రామునో సామాన్యజనుల నట్లు సేయుట చెప్పవలయునా యనుట. సదాగామిన్ = గాలిని, ఆఁకట్టన్=కదలనీక బంధించుటకును - అట్టి నిరంకుశ విహారులను

నాది...గింతు నేఁడాదినే; జ. మేదీనికిన్ వాదమేనాది...గింతు వేదాదినే.

మే. మామకన్యాయసంపన్నవై పన్ని యోకన్య నీవన్యులన్ జారసంపన్నులన్ భిన్నులన్ ఖిన్నులన్ జేసి [1] మన్మందిరాళిందభూమండలాసన్నులం జేయుమీ. రాచబిడ్డేటికే బిడ్డ! వాచాటతల్ సాఁగవే. సాఁగినన్ నీకు జూదంబులా, కాక [illegible] వినోదంబులా, గద్య పద్యానువాదంబులా, మాళవీముఖ్య రాగానుగానంబులా, దండలాస్యాది నృత్యావధానంబులా, ఇంద్రజాలాది మాయా విధానంబులా, వశ్యమంత్ర ప్రయోగోపసంహార విద్యావిచారంబులా, మందిరారామ వాటీలతాజాల మూలాభిషేక ప్రచారంబులా, హేమడోలావరోహంబులా, [2] నీరజావాసవీచీ సమూహావగాహంబులా, బంధుగేహా

---

నై తము నిలువరించుట కనుట, భుజంగ=సర్పములు, అంతటి క్రూరులనైన లోకువ గావించుకొనుటకు.

మామకన్యాయసంపన్నవై = నేను జెప్పెడి న్యాయములు గలదానవై. మన్మ... సంపన్నులన్ = నాయింటిముంగిట నేలపట్టుల దగ్గతినవారిని - లేక ఇందిరా సుందరత్వంబును=లక్ష్మిచేత చెలువై యుండుటను.

వాచాటతల్ =మాటకారితనములు, రాజునొద్ద మాటలు పెక్కు పనికి రావనుట. పాటలామోద = మంకెన పూవాసనగలదానా, రాజ ఉపకంఠ అటనంబుల్ =రాజు సమీపమున తిరుగుటలు, జూదంబులా=జూదములు మొదలైన వినోదకృత్యములుగా వనుట. ఆరామ...చారంబులా = పూఁదోఁట పట్టునందలి తీఁగ గుంపుల వేళ్లకు నీళ్లుపోయు తిరుగుటలా, హేమడోలావరోహంబులా=బంగారు ఉయ్యాలల నెక్కుటలా, నీరజా...గాహంబులా = తమ్మి కొలఁకుల సమూహములందలి అలల గుంపులందలి క్రుంకుటలా, రాజ...

---

1. అ. మన్మందిరం బిందిరాసుందరత్వంబునుం బొంది నానందముం జేయుమా. 2. అ. కాకకేళీ సరోవ్యూహవీచీ.

ప్రవేశంబులా, రాజహంసావళీ మందయానోపదేశంబులా, నీల
కంఠావళీ నృత్యశిక్షావిశేషంబులా, కాముకవ్రాతచిత్త ప్రమో
షంబులా,బొమ్మరిండ్లాటలా, పాటలా, పాటలామోద,రాజోప
కంఠాటనంబుల్ కఠోరాసిధారావలేహంబులే,శార్కరాంభోవ
గాహంబులే, సింహయోగంబులే, సర్పవల్మీక భోగంబులే, శైల
శృంగాగ్రవీథీ విహారావధానంబులే, తుంగతాళాగ్రకోటీతప
స్సంవిధానంబులే, మత్తశార్దూలకుంజ ప్రచారంబులే, సింధు
మధ్యప్రతారంబులే, గంధశుండాలశుండావినోదంబులే, సప్ర
మాదంబులే, కొమ్మ, మా కొమ్మదే రాచసఖ్యం బసౌఖ్యంబు
మే మొల్ల, మేమొల్లముల్ మాకులాభంబులే? డింభకే వేళ
నెమ్మోము సొంపారు, నేవేళఁ బాలిండ్లు పెంపారు, నేవేళ ఫాలం
బునం గుంతలశ్రేణు లల్లాడు, నేవేళ మైదీఁగయుర్ణ వీడు, నేవేళ

---

శంబులా=రాయంచలకు మెల్లనినడ కఅపుటలా. ఇట్టి వినోదములు కావు.మఱి, కఠో...హంబులే=వాఁడి కత్తి వాదరను నాకుటలు - అంత అపాయకరమైనవి. శార్కరాంభోవ గాహంబులా= మొరముగలనీటం గ్రుంకుటలు. సింహయోగంబులే=సింగములతోడి కూడికలు - అంతటి భయంకరములైన కనుట. ఇట్లె మీఁద నెల్లఁ దెలియునది. సర్ప...గంబులే=పాపపుట్టలోని సుఖానుభవములు, శైల...ధానంబులే = కొండ కొమ్ములయందు విహరించుటలు, తుంగ...నంబులే=పొడవులయిన తాటిచెట్లకొనలందు తపస్సు సేయుటలు, మత్త...ప్రచారంబులే=మత్తిల్లిన బెబ్బులియున్న పొదరింటను తిరుగుటలు. సిం...తారంబులే=ఏటినడుమును దాఁటుటలు, గంధ...మనోరంబులే = గంధగజముయొక్క తొండమును బట్టికొని వేడుకలాడుటలు,మాకు ఒమ్మదే=మాకు సరిపడదు. రాచసఖ్యంబు అసౌఖ్యంబు = రాజుతోడి చెలిమి సుఖముగాదు.

ఘాయాస మున్నాఁడ నంచుం బ్రతీక్షింప [1] నీ వంతపై యింతపై నేఁడు భూపాలుపాలై ప్రవర్తించుచోఁ గంబుకంఠీ, భవద్దర్శనోత్కంఠతన్ రాజగేహోపకంఠంబులన్ వచ్చునీవారి వారింతురే వారి దౌవారికుల్ వారధర్మంబు వారంచు దుర్వారులై. తన్మహాగేహ నిర్యూహ సేవారతాయాత భూపాలక వ్రాత వేదండ గండస్థలీ నిస్సర ద్దానధారావళీ జాతజంబాల సంఘంబు దుర్లంఘనీయంబు మాకున్, మహాదుర్గమం బే చొరన్ నిర్గమింపన్. మహోత్సాహవై వత్స! మత్సాహచర్యంబు కార్యంబుగై కొందు రమ్మంచు లెమ్మంచు [2] వల్లించు తల్లిన్ ధనాదాన

—* వారకన్య తల్లి పల్కు నిరాకరించుట. *—

విద్యామతల్లిన్ విటస్వాంతభల్లిన్ నిరూపించి కోపించి బుద్ధిం బ్రదీపించి 'అమ్మా! [3] విన న్నొల్లఁబోమ్మా, విచారించుకోమ్మా,

---

ఏ మొల్లముల్ = ఏధనము మొత్తములును, ఒల్లమనుట, భవద్దర్శనోత్కంఠతన్ = నిన్ను చూడవలయు ననుతమిచేత, రాజగేహ ఉపకంఠములన్ = రాజగృహ సమీప ప్రదేశములను, వారి, దౌవారికుల్ = ద్వారపాలకులు, వారధర్మంబు వారంచున్ = భోగమువృత్తి వారని, తన్మహా...దుర్లంఘనీయంబు = ఆతని నగరి పెద్ద వాకిళ్ల గుంపులయందు కొలుచునా సక్తితో వచ్చిన రాజసమూహముల యేనుంగుల చెక్కిటి పట్టులనుండి తొరఁగుచున్న దాన ధారల సమూహముచే పుట్టిన రొంపిగుంపు గడచిపోవఁ గష్టమైనది.

ధనాదాన...మతల్లిన్ = ధనములను తీయువిద్యయందు మేటియైనదానిని, విటస్వాంతభల్లిన్ = విటకాండ్ర మనస్సులకు బల్లెమైనదానిని, సన్మానుమంబు =

---

1. అ. నీవింతపై వింతలేన్నేని గల్పించెదే. క. యింత దీవింతయై నేఁడు నాసింగ భూపాలుపాలై. 2. అ. బోధించుతల్లిన్. 3. వినం జూడ నే వొల్లఁబోమ్మా; ద్రుతద్విత్వ భయమున నీపాఠము పెట్టఁబడినది.

భవన్నీతి దుర్నీతి, సన్మానుషం బింతయున్ లేని దుర్మానవశ్రేణి నీవేల యీవేల భాషించెదే? ఏమి భాషించెదే? ఏలనన్నుం బ్రమోహించెదే. రాయ చౌహత్తమల్లున్ వధూటీ సహోజాతభల్లున్ మహారాజవేశ్యాభుజంగున్ హయానేకపగ్రామహేమాది నానామహాదాన చంగున్ వధూలోకపాంచాలు సర్వజ్ఞసింగక్షమాపాలుఁ గైకొంట తప్పే? కకుప్పాలసంకాశుఁడే. వానియొప్పుల్ సతుల్ చెప్పరే? ఏలనొప్పింప? మాతల్ తనూజాతలన్ జాతవిత్తాశలై యాశలం బేశలత్వంబు లే కర్మిలిం బాపినారోటు? రారోటు రక్షారతిన్? గోర్కులీరోటు? నీవింత సెగ్గింపనెగ్గేమి గావించితిన్. లోకనిర్మాత నిర్మాతగాఁ జేయకేలా సదుర్మాతఁ గావించె! విజ్ఞాతఘోషా మనోవృత్త సంఘాతవున్, మాతవున్, గామసిద్ధాంత విఖ్యాతవున్, జూడ నేతద్దురాలాపముల్ చిత్తసంతాపముల్ గాఁ బ్రయోగింతురే? కూఁతుఁ జింతానదిన్ ముంతురే? పిన్ననాఁ డెల్ల నాఁ డెవ్వరిం గోరవే, చేరవే? మున్ను రంభోర్వశీమేనకాదుల్ సుకందర్ప సిద్ధాంతవేదుల్ వశీకార విద్యాధురీణుల్ ప్రవీణుల్ వరశ్రేణి నూహింపరే! చూచి మోహింపరే! వార లూహింపరే నీతులన్?

---

పౌరుషము, దుర్మానవశ్రేణి=చెడుపురుషుల సమూహమును.

కకుభ్పాల సంకాశుఁడు=దిక్పాలురం బోలినవాఁడు, మాతల్...లీరోటు=తల్లులు ధనమునం దాశ పుట్టినవారై తమకూఁతుండ్ర యాశలను మెత్తఁదనమును మాని పోఁగొట్టినారా, రక్షించు నాసక్తితో వారికడకు రారా, కోరినకోర్కులీరా యనుట. లోకనిర్మాత = బ్రహ్మ, నిర్మాత = తల్లిలేకుండునట్లుగా, విజ్ఞాత...ఘాతవున్=స్త్రీలమనో వ్యాపారముల నెల్లం

నిర్దయాలాపవై పాపవై పాపవేలా మనోజవ్యథన్ ? నిన్ను నేమందు, నేమందులన్ మానదే 1 మానసత్త్వంబు. చింతింపు మవ్వా! విభుండేమి దవ్వా? ఎఱింగించి రప్పించెదో, కాక, కామానలజ్వాలలన్ నన్ను నొప్పించెదో ! ఇంత 2 అంతేల నీకుం గొఱంతేలసద్ద్రివ్యముల్. తల్లి నే నెల్లవేళన్ మనోజాగ్నిచేఁ 3 గంది లోఁ గుందఁగా మ్రంద, నీమందటల్ చాలు ముందేటికిం గంటివే? కెంటసంబేల ఘంటాభవై మ్రోసెదే? అన్యకుం గన్యఁగానైతి. ఉద్దామశృంగారుపై దీనమందారుపై భూమిభృద్గాయగోపాళుపైఁ గామినీలోలుపై రాయశుండాలహర్యక్షుపై రాయకందర్ప ఫాలాక్షుపై రాయగోపాంగనాబృందగోవిందుపై సంతతానందుపైఁ బోచమాంబాలసద్గర్భ సంజాతుపై లోకవిఖ్యాతుపైఁ బాదపీఠాంకితాగాతి భూపావళీఫాలుపై, సింగభూపాలుపై ప్రాలి, నాచిత్త మున్మత్తమై సోలి, కామానలాయత్తమై రాను తేరాదు. నే నామధుండైన గౌరీవరుండైన వాణీధరుండైన లక్ష్మీవిభుండైన

---

తెలిసినదానవు. మానసత్వంబు=మానముయొక్క బలిమి, నీచేతి మందటల్= నీవలని పోరులు, కెంటసము=రచ్చ, ఘంటాభవై మ్రోసెదే = పెద్దగంటవలె అఱచెదవే, అన్యకున్ కన్యగానైతి=మఱొక్కనికి కూఁతురుగాఁ బుట్టనైతి రాయ...ర్యక్షుఁడు=రాజులనెడి ఏనుఁగులకు సింగమైనవాఁడు, రాయ... లాక్షుఁడు=రాజులనెడు మన్మథులకు శివుఁడైనవాఁడు, పాద...ఫాలుపైన్= పాద పీఠముచేత గుఱుతిడఁబడ్డ రాజసమూహముల నొసళ్లుగలవానిపై-రాజు

---

1. అ. మానసిత్వంబు, గ. జ. మానదర్పంబు. 2. అ. కంటేల నీకుం గొఱంతేల నీకుం బరిహాసముల్ చెల్లవే తల్లి. 3. అ. గుందెదన్ నాకు నీచేతి మందాటముల్ చాలు ముం.

దేవప్రభుండైన నన్నున్ మదిం గోరఁగా నొల్లనే. ఉల్లసత్ఫు ల్లమందార రాజన్మరందంబు నందంబునం గ్రోలు మత్తాళి దుత్తూరముం గోరునే? హేమరాజీవరాజీరజోరాజితాకాశ గంగానదీలోల కల్లోల డోలాచల ద్రాజహంసంబు శైవాల జంబాల గండూపదీభేకభేకీ ధులీ సంకులాసార కాసారముం జేరునే? మండితాఖండలానీత జీమూత నిర్యత్పయోధారలం ద్రావుసారంగి కుంభాంతరాంభఃప్రపూరంబులం ద్రావునే? మాధవోజ్జాత చూతాంకురస్వాదలీలాలసత్కోకిలేంద్రంబు ఝిల్లీరవక్రూర భల్లాతకీశాఖకుం బోవునే? సింగభూపాల బాహా పరీరంభ సంరంభ సంజాత సంతోషముం గోరు యోషాశిరోరత్న మాశించునే నీచసంభోగ మంబా! కుతర్కావలంబా! చలంబా! విలంబానులాపంబులన్ బాలసూర్యాభునిం బాయనాడన్. పురోభాగినీ! భోగినీరాజుకంటెన్ మహాభాగు, నాభాగ సౌభాగ్య శోభాగరిష్ఠున్, వరిష్ఠుం బ్రవేశించి

---

లతని పాదపీఠమునకు ఫాలము సోఁక మ్రొక్కుదురనుట, ఉల్ల...రందంబు= ఒప్పుచున్నదై విరిసిన కల్పవృక్షపు ఒప్పిదమైన పూఁదేనెను, మత్తాళి=గండు తుమ్మెద, దుత్తూరమున్=ఉమ్మెత్త, హేమ...హంసంబు=బంగారు తామరల పంక్తుల పుప్పొడిచేత ఒప్పుచున్న ఆకాశగంగానదియందు చలించుచున్న అల లనెడు ఉయ్యేలలం దాడుచున్న రాయంచ, శైవాల...సారమున్=ప్రాఁచితీఁగలు, రొంపి, ఆఁడుఎఱ్ఱలు, కప్పలు, ఆఁడుకప్పలు, ఆఁడుతాఁబేళ్లు వీనిచేత నెరసినదై సారములేని కొలంకును. మండి...సారంగి=అలంకృతమైన యింద్రునిచేతఁదేఁబడిన మబ్బులనుండి వెడలుచున్న జలధారలను ద్రావుచాతకము, కుంభా..రంబుల్=కుండలోని నీళ్లముంపులను. మాధవ...ద్రంబు=వసంతర్తువున పుట్టిన మావిచిగురును మెసవు వేడుకచేత ఒప్పుచున్న మేటికోకిల. ఝిల్లీ... శాఖకున్=జిలకోడికూఁతచే గడుసైన జీఁడిచెట్టునకు, నాభాగ...గరిష్ఠున్=

నీతిం బ్రకాశించి, నృత్తావధానంబులన్ మంజుగానంబులన్ జిత్తమార్జింతునే. విత్తమున్ లేమి వర్జింతునే. 2 ఎట్టిదిన్ విత్తమే రిత్తమై యేటికే? 3 నిత్యదంభా! దురారంభయుక్తిం 4 బ్రమోహింప విద్వేషినే? ఏలనే గోలనే, బాలనే, మానలేనే నరాధీశచూడామణిన్, వారకన్యా జనగ్రామణీ, పాపజాతీ! భవజ్జాతి దుర్జాతి పొమ్మంచు 'లెమ్మంచు 'నోచెల్లనేఁజెల్ల రేచెర్లగోత్రోద్భవున్ మానలే' నంచు 'నాయన్నలా, యన్యులం జేరఁబో'నంచు హృద్భల్లితో వక్రవాగ్భల్లితోఁ దల్లితో మాటఁ జాలించి ధైర్యంబు గీలించి సంజాత శాతోదరిన్ సోదరిం జూచి.

—* వారకన్య సోదరిని దనవెత దీర్ప వేఁడుట. *—

'అక్కా! ప్రసూనాస్త్రిధిక్కారముం జూచితే నేఁడు రాకేందు రాకం 5దురాకంపముం బొందె డెందంబు. 6 చైతన్య సంచాలియై కీలియై గాలి యేతెంచె. కోదండియై, తూణియై, బాణియై, కంపితప్రాణియై, కాముకారాతి తోఁతెంచె. వాసంతవేళా

---

నాభాగునివంటి చక్కఁదనపు పెంపుచేత మిక్కిలి గొప్పవాఁడు.

ప్రసూనాస్త్రి=మన్మథుని, రాకేందు రాకన్=రాకాచంద్రుని వచ్చుట చేత, చైతన్య సంచాలియై=ప్రాణములను మిక్కిలి చలింపఁజేయునదియై, కీలియై=అగ్గియై, కోదండియై=విలుకాఁడై, దండియై=నేర్పరియై, తూణియై=అమ్ముల పొదిగలవాఁడై, బాణియై=బాణములుగలవాఁడై, కాముకారాతి=మన్మథుఁడు, వాసం...వళిన్=వసంత ఋతువు పెంపునకు పట్టయిన తియ్యమామిడి

---

1. అ. నే నుపార్జింతునే విత్తమున్ నే విసర్జింతునే. గ. చ. నేను పార్జింతునే విత్తమున్ నే వివర్జింతునే. 2. ఏటికే విత్త మింకేటికే. 3. అ. నిత్యదంబా నిరాలాపదంబా నిరాలాపయుక్తిన్. 4. అ. బ్రలంభింప. 5. క. దురాస్కందపుం. 6. అ. చైతన్య సంచారియై మారియై కీలియై గాలియే తెంచె.

రమాకంద మాకందశాఖావళిం గోకిలారావకోలాహలంబుల్ విటస్వాంతహాలాహలంబుల్ దిశల్ మించి యేతెంచెనే. నేఁడు బాలామనోరంతుతోఁ గంతుతో, సింగభూమిశుతో, భోగదేవేశుతో, నన్ను వేదింపవే. కాము సంతాపముం జింపవే. డింపి

—*వారకన్యసోదరి దానివలపును సింగరాజునకుఁ దెలిపి కావవేఁడుట.*—

పుణ్యాంబునం బోఁగదే, రాఁగదే, లేగదే, వేగదే' యంచుఁ జింతించు నాత్మానుజాతం దనూజాతశంకాసమేతం గ్రుశీభూతఁ గన్గొంచు ' బాలా! లలాటాక్షు సేవింపుమీ, రాహు భావింపుమీ, శేష భోగిం బ్రకర్షింపుమీ, చంపకశ్రేణి వర్షింపుమీ' యంచుభీతిన్ నివారించి నీతిన్ విచారించి యారామ యారామసౌధాంత రాళస్థలిన్ [1]నరత్నాగారవేదిన్ మణిస్వర్ణ పర్యంకికా భాసమానున్, మనోభూసమానున్, ఘనున్, రావుసింగక్షమానాథ పౌత్రున్, సమీచీనరేచెర్లగోత్రాంబు సంజాతమిత్రున్, మహోదారచారిత్రు, సర్వజ్ఞసింగోర్వరాధ్యక్షు నీక్షించి దండప్రణామంబు సాపేక్షఁ గావించి హస్తాబ్జముల్ మోడ్చి ' దేవా! భవద్బ్రహ్మ సౌజన్య ధన్యన్, జగన్మాన్యఁ, గన్యన్, నిరన్యాంకపీ

కొమ్మలయందు, విటస్వాంత హాలాహలంబుల్=విటకాంద్ర మనస్సులకు కాలకూట విషములు, భోగదేవేశుతోన్ = భోగమందు ఇంద్రుఁడైనవానితో. లలాటాక్షు...వర్షింపుమా=ముందుచెప్పిన మన్మథ మలయమారుత చంద్రభ్రమరాదులకు విరోధులుగా శివ, శేష, రాహు, చంపకములను జెప్పుట తెలియునది. మణి...విరాజున్=రతనాల బంగారు మంచమునందు ప్రకాశించుచున్నవానిని, మనోభూసమానున్=మన్మథునకు సాటియైనవానిని, నిరన్యాంకపీఠాధిరోహన్=మఱియొకనితోడ అనెడి పీఁట నెక్కనట్టిది. నిరన్య ఉప

1. చ. మంత్రణాగారవేదిన్.

శాధిరోహన్, నిరన్యోపగూహన్, నిరన్యాభిలాషన్, నిరన్యా భిభాషన్, నిరన్యావకాశన్, నిరన్యప్రకాశన్, ప్రసూలోచన క్షిప్తబాష్పాంబుపూరన్, మనోజాతబాణావళీ శంకితప్రాణభారన్, సఖీమానసన్యస్త చింతాసమూహన్, [1]భగిన్యంక సం

—* సింగరాజు వారకన్యను జేపట్టి భోగినిఁగాఁజేయుట. *—

ప్రాపితానేకదేహన్, భవద్వైభవాకృష్టచిత్తన్ బరాయత్త వృత్తన్ గృపం జూడు'మంచుం బ్రశంసింప నాభోగదేవేంద్రుఁ డా సత్యభామా హరిశ్చంద్రుఁ డాకామినీ లోకపాంచాలుఁ డాసింగభూపాలుఁ డాబాల నాబాలశీతాంశుఫాలన్, సరోజాతహస్తన్, ప్రశస్తన్, శుకాధీశవాణిన్, లసన్నీలవేణిన్, మృగేంద్రావలగ్నన్, మనోజాగ్నిమగ్నన్, దయాదృష్టి రావించి భావించి నెయ్యంబుగావించి బాహాపరీరంభసంరంభనిర్ముక్త సంతాపఁ గావించి కందర్పకేళిన్ వినోదించి సద్భోగినింగాఁ

---

గూహన్ = మఱొక్కరి కౌఁగిలిలేనిది. నిరన్యాభిలాషన్ = అన్యమందు కోర్కిలేనిది. నిరన్యాభిభాషన్ = మఱియొకరితోడి మాటలులేనిది. నిరన్య అవకాశన్ = మఱొక్కరికి ఎడమిచ్చుటలేనిది. నిరన్య ప్రకాశన్ = మఱియొకరికి తెలియఁబడనిది - మఱొకరి కంటనుగూడఁ బడనిదనుట. ప్రసూ...పూరన్ = తల్లి కన్నులనుండి తొరుఁగుచున్న కన్నీటిముంపుగలది. మనో...భారన్ = మన్మథుని బాణసమూహముచేత సందేహింపఁబడిన ప్రాణముల మోచుట గలది. సఖీ...సమూహన్ = చెలికత్తెల మనస్సులం దుంచిన చింతల గుంపులు గలది- దానివెతకు దాని చెలికత్తెలు సైతము చింతలఁ గుందుచున్నారనుట. భగి...గూహన్ = అక్కయొడిని పొందింపఁబడిన దేహమంతయుఁగలది. (పాఠాం)

---

1. క. భగిన్యంగనాప్రాపితానేక దాహన్; గ. భగిన్యంగనాప్రాపితాతోన్నపగూహన్.

[1] ప్రసాదించి తన్మాత నుద్యద్గజారూఢఁ జేయించి విఖ్యాతి ప్రోయించి [2] యిష్టంబు లిప్పించి యొప్పింపఁగదున్.

ఉ. పండిత[3]కీర్తనీయుఁ డగుబమ్మెరపోతన యాసుధాంశుమా ర్తాండకులాచలాంబునిధితారకమై విలసిల్ల భోగినీ దండకముం రచించె బహుదానవిహర్తకు రావుసింగభూ మండలభర్తకుం విమతమానవనాథమదాపహర్తకున్.

శ్రీ కృ ష్ణా ర్ప ణ మ స్తు.
భోగినీదండకము
సంపూర్ణము.



అక్క—చేత పొందింపఁబడిన తన కౌఁగిలిగలది-అక్క— కౌఁగిలించుకొని తన యొ డియం దిడుకొన్నదనుట-అంతటి అవయవ దౌర్బల్యము సూచితము. పోహో... సంతాపకా = చేతుల కౌఁగిలి సంబరముచే వీడిన సంతాపముగలది. భోగినీ పట్టముకా=భోగినియను పేరును, పట్టపుదేవి కాక రాజుభోగార్థమై యంతః పురమునం దుండుస్త్రీకి భోగిని యని పేరు.

1. అ. సద్భోగినీపట్టముం దిట్ట మౌనట్టుగావే ప్రసాదించి. 2. అ. గావిం చి యొప్పించె నీభోగినీదండకం బిద్ధరామండలం బందుఁ జెల్వొంది యాచంద్ర తారార్కమై యొప్పుతకా. ఇది మీఁదిపద్యమునఁ జెప్పఁబడుటచే నిట ప్రక్షిప్తమే కానోపు. 3. క. మాననీయుఁడగు బమ్మెర. జ. నీతికోవిదుఁడు బమ్మెర.

# Anandasrama Series of Telugu Publications.

# ఆనందాశ్రమ గ్రంథరత్నమాల.



| | ప్రతి ౧-కి వెల రు. | అ. |
|---|---|---|
| శ్రీమదాంధ్రభాగవతము-కాలికోబైండు దళసరికాగితములు | 4 | 0 |
| డిటో డిటో డిటో రెండుసంపుటములు | 4 | 12 |
| డిటో మిక్కిలి దళసరికాగితములు రెండుసంపుటములు | 5 | 8 |

☞ ఈ క్రొత్తకూర్పునందు నానాదేశములనుండి రప్పింపఁబడిన ప్రాఁతవ్రాఁతప్రతులయందలి పాఠభేదములను అధికపాఠములను జేర్చి ముద్రింపించి యున్నాము.

| | | |
|---|---|---|
| శ్రీమదాంధ్రమహాభారతము, కాలికోబైండు గిల్టుపేరు దళసరి కాగితములు ఆదిసభాపర్వములు | 1 | 12 |
| డిటో ఆరణ్యపర్వము | 1 | 12 |
| డిటో విరాటోద్యోగపర్వములు | 1 | 12 |
| డిటో భీష్మద్రోణపర్వములు | 1 | 12 |
| డిటో కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వములు | 1 | 12 |
| డిటో శాంతిపర్వము | 1 | 12 |
| డిటో -ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల,మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు ఒకసంపుటముగా | 1 | 12 |
| డిటో ఆదిపంచకము, (ఆదిపర్వము మొదలు ఉద్యోగపర్వము వఱకు) | 5 | 0 |
| డిటో భీష్మషట్కము (భీష్మపర్వము మొదలు స్త్రీపర్వము వఱకు) | 3 | 4 |
| డిటో శాంతిసప్తకము (శాంతిపర్వము మొదలు స్వర్గారోహణ పర్వమువఱకు) | 3 | 4 |
| అమరకోశము-త్రికాండము సటీకము ఇంగ్లీషు అర్థముతో | 1 | 4 |

| | | |
|---|---|---|
| ఉత్తరరామాయణము - కంకంటి పాపరాజప్రణీతము-దళసరి కాగితములు కాలికోబైండు | 1 | 8 |
| డిటో మిక్కిలి దళసరికాగితములు గిల్టుపేరు | 2 | 8 |
| మనుచరిత్రము-సటీకము. కాలికోబైండు దళసరికాగితములు | 1 | 8 |
| డిటో గిల్టుపేరు మిక్కిలి దళసరికాగితములు | 2 | 8 |
| భర్తృహరి సుభాషితము-నీతి శృంగారవైరాగ్య శతకములు, శ్లోకములకు ఆంధ్రటీకాతాత్పర్యములతోను, ఏనుఁగు లక్ష్మణకవికృతాంధ్రపద్యములతోను. కాలికోబైండు గిల్టుపేరు మిక్కిలి దళసరికాగితములు | 2 | 0 |
| శ్రీకృష్ణకర్ణామృతము- మూఁడాశ్వాసములు-ఆంధ్రటీకాతాత్పర్యవిశేషార్థములతోను, ఆంధ్రపద్యములతోను, కాలికోబైండు గిల్టుపేరు | 1 | 8 |
| రాఘవపాండవీయము - టీకాతాత్పర్యసహితము కాలికోబైండు | 1 | 8 |
| డిటో గిల్టుపేరు (లైబ్రెరికూర్పు) | 2 | 0 |
| హరిశ్చంద్రోపాఖ్యానము-ద్విపద - గౌరనమంత్రిప్రణీతము. అతిప్రౌఢమును సలక్షణమును రసవంతమునైన కావ్యము. ఇందు సొబగైనస్వభావోక్తులును జాతీయములును ముద్దుగులుకుచుండును. టిప్పణసహితముగా కాలికోబైండు | 1 | 0 |
| భాస్కరరామాయణము-పాఠాంతరములతోను, ప్రాఁతప్రాఁత ప్రతులం దగపడు రసవంతములైన అనేకనూతనపద్యములతోను చిత్రపటములతోను, దళసరికాగితములు | 2 | 8 |
| డిటో మిక్కిలి దళసరికాగితములు గిల్టుపేరు | 3 | 8 |
| భోగినీదండకము-టీకాపాఠాంతరములతో | 0 | 3 |
| పారిజాతాపహరణము-పాఠాంతరాదులతో | 0 | 8 |
| నలచరిత్రము ద్విపదకావ్యము కఠినపదములకు టిప్పణముతో | 0 | 10 |
| బాలభాగవతము-ద్విపదకావ్యము. పటములతో | 0 | 12 |
| ఆంధ్రనిఘంటుత్రయము - (ఆంధ్రనామసంగ్రహము ఆంధ్రనామశేషము సాంబనిఘంటువు) సటీకము, దళసరికాగితములు కాలికోబైండు | 0 | 12 |
| డిటో డిటో అట్టబైండు | 0 | 10 |

| | | |
|---|---|---|
| ఆంధ్రవ్యాకరణసంగ్రహము, దళసరికాగితములు | 0 | 6 |
| గజేంద్రమోక్షణము, సటీకాతాత్పర్యము, కాలికోబైండు | 0 | 8 |
| డిటో డిటో అట్టబైండు | 0 | 6 |
| రుక్మిణీకల్యాణము-సటీకాతాత్పర్యము, కాలికోబైండు | 0 | 8 |
| డిటో డిటో అట్టబైండు | 0 | 6 |
| బిల్హణీయము-పద్యకావ్యము-కాలికోబైండు దళసరికాగితములు | 0 | 8 |
| డిటో డిటో అట్టబైండు | 0 | 6 |
| సుమతిశతకము-టీకాతాత్పర్యసహితము, దళసరికాగితములు | 0 | 2 |
| దాశరథిశతకము డిటో | 0 | 4 |
| శ్రీవేంకటేశ్వరశతకము డిటో | 0 | 2 |
| కుమారీశతకము డిటో | 0 | 2 |
| భాస్కరశతకము డిటో | 0 | 4 |
| మానసబోధశతకము డిటో | 0 | 3 |
| నృసింహశతకము, మూలముమాత్రము | 0 | 1 |
| బాలరామాయణము, శ్లోకములు, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | 0 | 2 |
| శ్రీగుణరత్నకోశము, శ్లోకములు-ఆంధ్రటీకాతాత్పర్యసహితము | 0 | 2 |
| నీతికథాసంగ్రహము | 0 | 4 |
| శ్రీసహస్రనామస్తబకమ్ కిత్తానుబైండు | 0 | 10 |
| నీతిచంద్రిక-చిన్నయసూరి ప్రణీతము | 0 | 6 |
| శ్రీమద్భగవద్గీత-మూలము పాకెట్ సైజు | 0 | 4 |
| శ్రీమద్భగవద్గీత-టీకాతాత్పర్యవిశేషార్థసహితముగా ముద్రించుచున్నాము. | | |
| సప్తమస్కంధము టీకాతాత్పర్యసహితము | 1 | 4 |
| డిటో మూలము | 0 | 4 |
| ధైర్యకవచము-అత్యద్భుతకథ | 0 | 6 |
| భరద్వాజసంహిత | 0 | 12 |
| శృంగారనైషధము-టీకాతాత్పర్యసహితము | 3 | 8 |
| విశ్వగుణాదర్శము-సటిప్పణాంధ్రపద్య టీకాతాత్పర్యేతిహాససహితము కాలికోబైండు | 2 | 8 |
| రామదాసుచరిత్రము | 0 | 12 |
| స్తోత్రార్ణవము | 0 | 12 |

| | | |
|---|---|---|
| సువర్ణముక్తి (నవల) | 0 | 8 |
| ఆచార్యసూక్తిముక్తావళి-పద్యకావ్యము | 2 | 8 |
| హరిశ్చంద్రనాటకము-తెనుఁగు | 0 | 8 |
| శ్రీవిష్ణుసహస్రనామావళి-పాకెట్ సైజు | 0 | 2 |
| తత్త్వత్రయమ్ (పిళ్ళైలోకాచార్యులచే ద్రావిడభాషయందు రచింపఁబడినది) మణిప్రవాళ వ్యాఖ్యానముతోను, తెనుఁగు తాత్పర్యముతోను కిత్తానుబైండు | 1 | 8 |
| అధ్యాత్మరామాయణకీర్తనలు | 0 | 6 |
| శ్రీరామకాలనిర్ణయబోధిని | 0 | 8 |
| పరమార్థప్రకాశము | 0 | 6 |
| శ్రీమద్వాల్మీకి రామాయణము-ఆంధ్రవచనము, కాలికోబైండు బాలకాండము, 16 పటములు | 1 | 4 |
| అయోధ్యాకాండము 1వ భాగము 11 పటములు | 1 | 4 |
| డిటో 2వ ... 12 ... | 1 | 4 |
| ఆరణ్యకాండము 14 పటములు | 1 | 8 |
| కిష్కింధాకాండము 15 ... | 1 | 4 |
| సుందరకాండము 16 ... | 1 | 12 |
| యుద్ధకాండము 1వ భాగము 10 పటములు | 1 | 4 |
| డిటో 2వ ... 12 ... | 1 | 4 |
| డిటో 3వ ... 12 ... | 1 | 4 |
| శ్రీమహాభారతము-ఆంధ్రవచనము కాలికోబైండు | | |
| ఆదిపర్వము ప్రథమ భాగము | 1 | 4 |
| డిటో ద్వితీయభాగము | 1 | 4 |
| డిటో తృతీయభాగము | 1 | 8 |
| సభాపర్వము | 1 | 8 |
| శాంతిపర్వము ప్రథమభాగము | 1 | 4 |

తక్కినపర్వములు ముద్రణమందున్నవి.

వేమూరు-వేంకటకృష్ణమసెట్టి & సన్స్,

56 ఆండ్రసన్ వీథి, మద్రాస్.